# అంబరీష చరిత్రము



ఇది

బ్రహ్మశ్రీమదజ్జాడాదిభట్ట - నారాయణదాసునిచే

విరచింపఁబడి,

యతని సతీర్థ్యులును శ్రీవిజయనగర సంస్థానాధ్యాపకులును

బ్రహ్మశ్రీ, కానుకుర్తి వెంకటకృష్ణారావుపంతులుగారి

ప్రోత్సాహమున ముద్రింపఁబడియెను

---

చెన్నపురి:

శ్రీ "వైజయంతీ" ముద్రాక్షరశాల న్ముద్రింపఁబడియె

---

1910

 [దీనివెల 6 అణాలు

*ఈ పుస్తకము కంప్యూటరీకరణ మరియు డిజిటైజేషన్ చేసినవారు:*

**తెలుగు సంప్రదాయ కళల పరిరక్షణ సమితి**

**తెలుగు భాష, కళల పరిశోధన గ్రంథాలయము**

ప్లాట్ నెం. 30, రోడ్ నెం. 3, శ్రీకనకదుర్గ గెజిటెడ్ ఆఫీసర్స్ కాలనీ,

గురునానక్ నగర్ మెయిన్ రోడ్, విజయవాడ - 520 008.

సెల్ : 9959517764

# ఉపోద్ఘాతము.



ఈ యంబరీషోపాఖ్యానము దొట్టి మరి కొన్ని యక్షగానములను వ్రాసియుంటిని. యక్షగానమనఁగా స్వరనియతములగు నక్షరసందర్భములు పద్యములవలెఁ దద్గీతబంధములంగూడ సమవ్యాకరణచ్ఛందోబంధములుగఁ దెలియునది. గణసమూహము చేరికం గలుగునుచ్చారణకాల విన్యాసము గద్యపద్య గీతబంధములకు సమానమే. పఠనశక్తి జనరంజకము కానపుడు రుచ్యముగఁ జదివి సుస్వరముగఁ బాడలేనపుడు ఛందోలయలతోఁ బనియేమి మనసులోఁ జదువుకొనుట చెల్లును గాని వర్ణాత్మకముగాఁగాని కేవలధ్వన్యాత్మకముగఁగాని యెలుఁగెత్తి సుస్వరముగఁ బఠించినపుడు కదా గద్యపద్య గీతములకు సార్థకము కేవల వర్ణాత్మకముగ జూచిమాత్ర మెఱుంగుటకు గద్యపద్య గీతములన్నియు నొక్కటియే ఆంధ్రభాషయందుఁ గేవల గద్యపద్యములే యిదివరకుఁ బఠింపఁబడుటకును యక్షగానములుల్లంఘింపఁ బడుటకుఁ గారణము గీతబంధశబ్ద మాత్రద్వేషమా సంగీతకుఠార ప్రాయులకుఁగాకున్న సహజసుందర మృదుపద సందర్భముల తేనెలూరు నాంధ్ర యక్షగాన ప్రబంధము లధ్యాత్మరామాయణ మృత్యుంజయవిలాసములు సంస్కృతమున గీతగోవింద శ్రీకృష్ణలీలా తరంగములును బాఠశాలలకు వెలికానేల? తత్పదపదార్థములు విద్యార్థులకుఁ జేదా? గద్యముకన్నఁ బద్యము పద్యముకన్న గీతము రచించుటకును దెలిసికొనుటకును బఠించుటకు శ్రమకరము నాట్యధర్మముగ నభినయించుట గీతము లోకధర్మముగ నభినయించుట సాహిత్యము కాని యీ రెంటికి బంగరు దాని రంగువలె వ్యాఖ్యానము కాన్పించుచున్నది. కొంద అక్షరములతోనే

కాని వాని సుస్వరోచ్చారణముతోఁ బనిలేదని యనరాదు.
మనసులోఁ గొణుగుకొనఁ వచ్చునుగాని పైకిఁ జదువునపుడు నీటు
గల వస్తువులతో బయలుదేరునట్లు సుస్వరంబుల దమ కంఠముల
నలంకరించుకొనుటకు విద్యార్థులు నోమలేదా? కావున యక్ష
గానములుకూడ వాగ్గేయకార ప్రణీతములైనచోఁ బాఠశాలల నంగీ
కరింపఁ బడవలసినదే నేఁ దెలిసినమట్టు యక్షగానముల కుదాహరణముగ
నిందుతోఁ బదివిరచించినాఁడను రాగములు తాళములు గద్యములు పద్య
మును వాని గుర్తులకేమి గాని యక్షరములగల రసగ్రహణమునకన్ని
బంధములును సమానములే. ఇది వఱకెందుకు పట్టుపట్టి యక్షగానముల
బదుల జోరసీయకున్నారు చెప్పుమా మఱి యొకసారి యించుమించు
మూఁగపంచాంగ మాబడులలో సుస్వరోచ్చారణ సౌందర్యము పద్యగీత
పఠన సౌష్ఠవమును బాలురకు మరుగు పఱ్చవచ్చునా? అక్షరాంక చిహ్న
ములంగాంచి వాని యర్థమెఱుగుట యెట్టిదియో చతుష్షష్ఠి కళలలో
యథాస్వరోచ్చారణ మట్టిదని తెలియఁదగదా? మునపటికన్న సంగీత
మున కిపుడు పొగ్లుదగిలెను. ప్రస్తుతకవులు గద్యపద్యములవలె నూరూర
నింటింట గీతముల గాయకులు నించుచున్నారు. యథాక్షరోచ్చారణము
కోటికబ్బినచో సుస్వరగీతపఠన మొకరి కబ్బునేమో? సుశారీరము కా
రణము శ్రావ్యముగఁ బఠించుటకు. మూఁగ కాకుంటచాలు నుచ్చారణము
నకు. అభ్యసింపఁగా నొపన్యాసకులు తేలినట్టు గాయకులుకూడ నేకాల
ముకైనం దేలరా? కావున విమర్శకులయిన పాఠనియమనాధికారులు
బడులలో యక్షగానములఁ జదివింపింతురుగాత. సుస్వర పాఠకులచే నెల్ల
లోకము రంజింపఁబడునగావుత మని దేవునిఁ బ్రార్థించుచున్నాఁడను.

ఆది భట్ట - నారాయణదాసుఁడు.

# అమ్బరీష చరిత్రము



కం. శ్రీవిజయనగరగోపా,
లా విబుధవిలోల మోక్షలక్ష్మీపాలా
కావుర మమ్ము సకలసా
ఖ్యావలి నందించి సవనవాంబుదనీలా!

కల్యాణి - చతురస్ర.

పల్లవి. నిదానముగనీ-పదారవిందము-సదానమ్ముకొన్నాఁడరా నా।
మదిన్‌జొచ్చి-సమ్మదంబిచ్చిసం-పదల్వొట్టునీవాఁడరా।
అ. ప. సదయుఁడరా-చక్రధరా-సరగునఁగని-కరముగొనుమనవివిను॥ని॥
౧. ఇలన్నమ్మకము-వలెన్నిజమెచటఁ-జెలంగనేరదుతలంపఁగాని।
మ్ములన్నీదుభ-క్తులంబోలుసా-ధులున్లేరభవమలంపఁగా।
దళితదయా-తతహృదయా।
కలుములలరించుఁకలుషములఁద్రుంచు॥ ని॥
౨ త్యజించనీదుష్టజీవులన్మతి-భజించనీపుణ్యకర్మలన్।
భుజించనీసాత్వికాన్నమున్నను-సృజించనీకథుసధర్మలన్।
నిజమననీ-నినుఁ గననీ।
విజయనగరశ్రీవేణుగోపాల ॥ ని॥

కాఫీ - చతురస్ర.

పల్లవి. ఓరోరిగణపతిరానీ-కుంద్రాల్లుపెట్టెదరా।
అ. ప. నేరములెంచినా-దారికడ్డురాకు-నీకిదెజోహారురా ఓ॥
౧. కారుణ్యగుణసాగరారారనీ।
కరమునననుదువ్వరా।
భారములన్నిటికినీవేయనుచుని।
ర్భయుఁడనైయున్నాఁడరా॥ ఓ॥
౨. గుజ్జువేల్పవేగరారానే।

గోరినవరమీయ్యరా।
బొజ్జనిండనీకుఁబాయసముఁబోసెద।
మోమెత్తిమాటాడరా ॥ ఓ॥

గీ. సహజపాండిత్యమునఁ గావ్యసరణిఁజేసి
యెల్లరిహితముఁ గోరెద నేకదంత
నేను ని న్నేది యడుగను గానినీదు
నంబికొండయ్య సాయమె నాకుఁ జాలు.

ఆనంధభైరవి - త్ర్యిస్రగతి.

పల్లవి. ననుఁగన్నతల్లి యోనల్వరాణి।నామాటలలరించు మోమంజువాణి
అ. ప. నినుఁగొనియాడెద-నేనీలవేణి।నీకన్నదిక్కెవ్వ-రేకంజపాణీ॥ న॥

౧. జగమెల్లనడుపునీ-శక్తికాదే।
నగుమోముకన్నర్చి-ననుఁగావరాదే।
తగనీదుప్రాపుపా-తకముడ్చిపోదే।
యిగురుఁబోడినా-యెడదయలేదే॥ న॥

౨. నేనమ్ముకొన్నాఁడ-నేజాలమేలా।
వేనన్నుఁగాపాడవే-మృదుశీలా।
మానుగనన్నేంచు-మాబొమ్మయాలా
శ్రీనారాయణదాస-జిహ్వాగ్రలోలా॥ న॥

చం. నను దయఁజూడవే మఱియు నాదగునాల్కను నాట్యమాడవే
వినయముఁ బెంచవే మిగుల వింతగ నీసభ రక్తి ముంచవే
నిను విడఁ జాలనే కరము ని న్బ్రితిమాలెద జాల మేలనే
ననరులనల్లి వేత్రుతులనింపినవాఁడగుకన్నతల్లివే.

కాంభోజి - చతురస్రగతి.

పల్లవి. అమ్మలారయయ్యలార-హరికథలనువినుఁడీ॥
అ. ప. బొమ్మలాటవలెమనసంసా-రమ్మెల్లనాటకమనుకొనుఁడీ॥ య॥

మి. సొమ్ము-ల్బల్వలపుసూపుచి-త్రమ్ము-ల్నమ్ముకొన్నబంధుజ-నమ్ముల్
మసనమసింపుజీవి-తమ్ము-ల్వట్టిబూటకమ్ము॥ ల॥

౧. తెలిసియుఁదెలియకమనమి-ట్టులవ్యసనముఁబొందిl

బలుగారడిసంసారములోనఁ-బడుచుంటిమయ్యామాయిబ్బంది।
చెలఁగున్-దమయంతటఁదామవి।తొలఁగున్-సుఖదుఃఖమ్ములుప్ర
కృతులగున్ భవనాశములనిశము-వెలుగుఁస్సాక్షిమాత్రుఁడైయాత్మ॥
౨. జ్ఞానహీనులౌవారికిభవసం-కటములుమదినిండున్।
శ్రీనారాయణదాసుల కేసు-స్థిరానందముండున్।
రానీ-కోరనికోర్కెలువుటి-పోనీ-దాఁచుకొన్న సొమ్ములు।
తేనీ-మంచిచెడ్డలన్విధి-కానీ-యేదియెల్లైన॥ సమ్మ॥

సీ. ఆదికారణ మెన్న రాదు కావున స్వభా
వములోక మనిచెప్ప బౌద్ధమతము
జగ మబద్ధము బ్రహ్మ సత్యం బటంచు నెం
తయుఁ బోధపఱచు నద్వైతమతము
సగుణుఁ డీశుఁడు ప్రపంచము నానియిచ్ఛాని
భూతి యంచు గణించు ద్వైతమతము
ఇహమె నిక్కము పరం బెల్లఁ గల్ల యటంచుఁ
దెల్లము సేయు నాస్తికమతంబు
ఇన్నిమతములలో సార మెంచి యెంచి
దయయు నిర్లోభమును భక్తి ధర్మబుద్ధి
నాల్గిట స్థిరముగఁ బొంది నయము మీఱ
జయము మనమంద వలయునో సభ్యులార.

ధన్యాసి - త్రిశ్ర.

పల్లవి. కూళలైజంతులఁగొట్టినమలనేల।
కూరగాయలు దినలేర-పప్పు-కూడుమిక్కిలి మెక్కలేర।
పాలుచక్కెరమంచి-పండులారగించి।
బలమునఁ-జరియింపలేరదీని-భావముకనిపెట్టలేరసుజనులార॥కూ॥
౧. పసులబాధింపఁగవలయునాయెల్ల।
పనులకుజంత్రములులేవా।
పాటు-బడనన్నిసాధ్యములుకావా।

పసమీఱ వేల్పులవశపర్చుకొనమంచి।
ప్రార్థనములు సేయరాదా-జీవ-బలులనిచ్చుట।
హింసకాదా-యిదా-మర్యాద॥ కరు॥

౨. తలలుగొట్టికోట్ల-కొలదికొంపలుదీసి।
తమడాబుగన్పర్చనేలా।
నాత్మ-వలెనందఱినిజూడరేల।
ఇలఁదమమతమున-నెనయనివారల।
నెంతేనిహింసింపనేల-శాంతి।
మెసఁగమంచినిదెల్పరేల-యేవేళ॥ కరు॥

చం. మహిఁ గడు నైకమత్యమున మానవు లందఱు నొక్కరీతిగా
సహనము సర్వభూతదయ సత్యము జ్ఞానముఁగల్గి యుండొరున్
రహి ననుకూలదృష్టుల ననారతము న్గనుఁగొంచు సౌఖ్య మీ
యిహమునఁ బొందుచుంట సిఁక నేఁబరికించెడిభాగ్యమెన్నఁడో.

శంకరాభరణము - మిశ్రగతి.

పల్లవి. పరులగొప్పఁజూచియోర్వలేకుండిన-వానికిసుఖముండునా।
యెందైనన-వానికిసుఖముండునా॥

అ. ప. పరికింపనొరులకు-బలుచేటుగోరిన-వానిదైవము మెచ్చునా।
యెందైనన-వానికిమునమిచ్చునా-సుజనులార॥ ప॥

౧. తానొరులనుగొట్టఁ-దన్ను దేవుఁడుగొట్టుఁ
దప్పునాయీసామెత-లోకములోనఁ
బూనియొకనివంచఁ-బూనువాఁడు నైజ-ముగఁదాఁ
గూడవంగఁడాసుజనులార॥ ప॥

గీ. ఒరులగొప్పఁజూచి యోర్వలేకుండిన
వాఁడుతప్పకుండఁ గీడుఁ బొందు
అంబరీషువ్రతము నారసియుల్కుచు
ర్వాసుఁ డెట్టి యిడుమఁ బడెనొ వినుఁడు.

భైరవి - రూపకము.

పల్లవి. అంబరీషచరితమునవర-సామృతభరితమా॥ యం॥

అ. ప. సమ్మోదస్ఫురితము-సదాపహృతదురితమా॥ యం॥

మి. నెమ్మదిమీఱఁగసప్త-ద్వీపములేలుచుమఱి-యిమ్మహిలో
సత్యముధర్మముతప్పక ప్రజలను-సమ్మతిగాఁ-బ్రోచుచు
నిమ్ముగలోకమ్ములకుఁ-బ్రియమ్ముగనన-యమ్ముఁగడు
ఘనమైనయశమ్మునిలుపు॥ నం॥

౧. అతనిరాజ్యమందు లేరు-యాయవారమెత్తువారు
వెతకిననువితంతువులు-వెలయాండ్రున్నానరారు
సతీపురుషులున్నిగుల-సదాచారసంపన్నులు
శతాయువులునిరోగులు-సకలవిభవములఁజెలఁగెద॥ రం॥

౨. మూడుసార్లు నెలకువాన-ముదముతోడఁగురియుచుండు
పాడిపంట లెల్లచోట్ల-బలువైభవమొప్పనిండు
ఏడనైనాక్రూరజంతువులు-నించుకైనఁగానరావు
చూడనన్యాంపాశనుల-చోటులన్లేరెవరైన॥ నం॥

సీ. సత్య మాస్తిక్యంబు సర్వభూతదయయు
సతతమెవ్వనికి నైజంబు లయ్యెఁ
గడుఁబరస్త్రీవిముఖతయు దీనావనం
బరయ నెవ్వానికి బిరుదు లయ్యెఁ
గులశీలరక్షణంబులును గోబ్రాహ్మణ
భక్తి యెవ్వనిస్వభా వంబు లయ్యె
శిష్టావనము దుష్టశిక్షయు శ్రీహరి
పదసేవ యెవ్వనిప్రకృతు లయ్యె
దానమునఁ మేటియఖిలవిద్యావినోది
యెంతయో సుందరుఁడు జగదేకబలుఁడు
సకలభూమండలము నేలు చక్రవర్తి
కృతయుగమునందు నాయంబరీషుఁ డలరె.

భైరవి - మంజరి.

౧. స్థిరమతితోడన్సర్వజగంబు-న్శ్రీహరిమయమని యెంచున్
బరోపకారమెతను వెత్తుటకున్-ఫలంబనినిశ్చయించున్॥

మెలపునసాహారవిహారములన్-మితముగాఁగఁజరియించున్।
అలయంబరీషుఁడేరీతియుభాగవ-త్యాగగణ్యుఁడైమించున్॥

గీ. సాధు లౌ నన రాజ్యంబు సల్పి కొంత
కాలమునకు విరక్తిని గలిగి తనదు
కొడుకునకుఁ బట్టముం గట్టి యడవి కేగఁ
దలఁచి తనభార్యతో ని ట్లతండు వలికె.

తోడి - మిశ్రగతి.

పల్లవి. ఇఁకభోగములుచాలునే-జీవేశ్వరిమన॥ కిఁక॥

అ. ప. ఇకభోగములుచాలు-నెందు కేవెయివేలు
ప్రకటమౌ శ్రీహరి-భక్తికడ్డులుగాన

మి. సకియనేనిశ్చింతనడవికిఁజనెద నే-మునివృత్తితోనట
సకలభూతసముండనైమటి-శాశ్వతానందముంబొందెద॥ నిఁక॥

౧. సంసారమిదియెల్ల-స్వప్నమువలెఁగల్ల
హంసపాదముదీని-యందుంతునోచెల్ల
కంసారినేనే-కాంతముగొల్తునే-జితేంద్రియుఁడనై
హంసస్వాధీనమునేసికొని-యాత్మారాముఁడనయ్యెద॥ నిఁక॥

గీ. ప్రాజ్ఞుఁడౌ మనపుత్రుఁడు ప్రజల నేలు
నీతి దప్పకే కావున నీవు వాని
రక్షణము బొందుచుండు నేనీకుఁణంబ
తపసి నయ్యెద ననఁగ నత్తన్వి పల్కె.

కాఫీ - చతురస్రగతి.

పల్లవి. ప్రాణనాథతాళఁజాలరా-నిముస-మైననినుఁబాసి॥ నా॥
నేనీడవంటిదాననీకు-న్నీవునన్నెటులఁబాయఁగలైదో॥ నా॥

౧. ఎటులవిష్ణు తేజమునఁగలియుటకు-నీవెంచుచుంటివో సంతతంబు
అటులనీలోనలయముఁజెందుటకు-నాసించెదఁద్రికరణశుద్ధిగా॥ నా॥

౨. శ్రీకాంతునకెట్లునీవువనమున-నేకాంతసేవసేయఁజూచెదో
యోకాంతుఁడనీకట్లుపరిచర్య-లొనరింపఁగనీవెంటనుందు॥ ప్రాణ॥

కం. అని వేడుసతీమణితో

వనమునకుం బోయి యచట వానప్రస్థం
బున నుపనిషదర్థమ్ములు
మునీశ్వరులచేత వించుముదమున నతఁడున్.

బిలహరి - త్ర్యస్రగతి.

పల్లవి. ద్వాదశీవ్రతమాచరించెర-మాధవార్పితంబుగా
అ.-ప. మేదినీసురోత్తముల్దను-మేల్మేలని మెచ్చఁగా॥ ద్వా॥
౧. వేదములనుజదువువారు-వాదములను జేయఁగా
సాధునుతముగాఁగ భోజన-శాల పెద్దదీవిగా॥ ద్వా॥
౨. అన్న రాసులునగములుగా-నాజ్యధారలునదులుగా
ఉన్న కూరలువనములుగాఁ-గొన్న పాలుసరసులుగా॥ ద్వా॥
౩. ధరాసురవరులపంక్తులు-వరపురనిచయంబుగా
సురుచిరంబగునిట్టిదీవికి-నరయఁదానుభర్తగా॥ ద్వా॥
౪. నారాయణదాసపోషు-పేరనారగింపఁగా
క్రూరతదుర్వాసుఁడతనిఁ జేరియన్నమడుగఁగా॥ ద్వా॥

కందార్థము.

ఓకరుణాకరయోనృప, యేకాదశినుపవసించి యెంతయునేని
ట్లాకులపడుచున్వచ్చితి, నాఁకటిచేఁ బొగలుచుంటి “నన్నంబిడవే
నిరతాన్నదాత-మన్నింపఁగదే”
పన్నగదయతోడనాము-కన్నులదొరసీకునిప్పుడు
వన్నెమీఱఁగద్వాదశీవ్రత-వరఫలంబు నొసంగుఁ గావుత॥ న॥

మంజరి - ధన్యాసి.

౧. వల్లేయనిజనవల్లభుఁడప్పు-డుల్లంబునముదమందెన్
అల్లననామునియమునానదిలోఁ-ద్రుళ్లుచునాయతుగందెన్॥
౨. బాపనిరాకకునోపికతోఁ నాఁ-భూపుండెదురుంజూడన్
దేవునఁబారణభూపతిసేయన-మీఁపంబైతతిగూడెన్॥
గీ. ఎంత కనిపెట్టుకొన్నఁ గసింతయైన
మానివరురాక లేమి నమ్మనుజవిభుఁడు

చెంత నున్నట్టి బ్రాహ్మణ శ్రేణితోడ
నిట్టు లనియెను గే ల్మోడ్చి హితముఁ గోరి.

కాంభోజి - రూపకము.

పల్లవి. ఎంతటికిని రాకపోయె - నేమి సేతు నార్యులార
అ. ప. ఇంతవట్టు నాఁగితినా - రంతు బాపఁ డేల రాఁడో॥ యెం॥
౧. కుడిచితి నా కోపగించుఁ - గుడువకున్న ఫలంబు నశించు
తడబడకుండ నాదరించుఁ - డోడయుండ నేమి కార్యులార॥ యెం॥
౨. పారణ సేయు వేళ మిగిలె - బాపఁ డట్లు నీటఁ దగిలె
ధీరవర్యులార మిగులవి - చారించుఁడీ నా కేదారో॥ యెం॥
౩. విజయనగర గోపాలుని - సుజనులార మీరీ తజుని
గజిబిజినిఁక మానిహరిని - గాంచి చెప్పఁడయ్యదీని॥ నెం॥

కం. అని వేమనంబరీషునిఁ
గని బ్రాహ్మణు లెల్ల మిగులఁ గనికరమున ని
ట్లని రఖిలధర్మ శాస్త్రము
లను శోధనచేసి కడు నిలాపతి యలరన్.

గీ॥ భూపవర్య నెట్టి బాపఁడు నీటిలో
మునిఁగి రాక నిన్ను మోసపుచ్చె
కుడువ కుంట కాదు కుడుచుటయును గాదు
సలిలభక్షణంబు సమ్మతంబు.

మంజరి - కన్నడా.

౧. అనవిని శ్రీహరి - దనమున నిడి - యవనీశుఁ డట్ల సేయన్।
జనఁగ వలయు నదె - సమకూడె నను చు - ముని కోపముతో డాయన్॥
౨. అనఘాయన్నము నారగింపవే - యనవిని మునివరుఁ డల్కన్
ఘనకాలసమయ కాలు నిభఁగిని - దనరుచు నిట్లని పల్కెన్॥

ఉ॥ ఓరి దురాత్మ తుచ్ఛమతి నోడక హా కరి నాత్మకుండ వై
పారణ జేసి నన్నతిథి బ్రాహ్మణు నిందితు జేసి తేమిరా
ఘోరము గాఁగ నాదు ఘనకోపమహాగ్నిని గాల్తు నంచు సం
హారము సేయఁగా జటసమగ్రముగా దెగ దీసి వైచినన్

సీ. అభ్రం లిహాదభ్ర విభ్రమాభ్ర భ్రమ
కృన్నీల దీర్ఘశరీర మమరఁ
బ్రళయకాలానల ప్రభను జక్రీకృతే
క్షణముల రౌద్రమక్షయము గాఁగఁ
త్రైలోక్య కబళనోత్సాహ సూచక ఘన
వక్త్ర త్రయోగ్రత వాసి కెక్క
బర్బు బర్బర కేశ పాశారుణ ప్రభ
కాల సంధ్యారాగ కాంతిఁ దనరఁ
గ్రకచ కఠిన కరాళ దంష్ట్రిలు వెలుంగఁ
బదయుగోద్ధూత పాంసువు ల్బదలు గప్ప
నేలఁ బదముల నింగిని నిడ్డతలల
నత్తి కొనివచ్చె గృత్తి తా మిత్తి పగిది.

గీ. ఇట్లు తను మ్రింగుటకు విజృంభించి వచ్చు
ఘోర శక్తిని గనుఁగొని క్షోణి విభుఁడు
రహిని భీతిల్లి యార్త శరణ్యుఁడైన
శ్రీహరిని వేడె నిట్లు రక్షింపు మనుచు.

యదుకులకాంభోజి - రూపకము.

పల్లవి. శరణంటిని-గరుణింపుము-సురవందితచరితా॥ శ
అ. ప. హరినామొజవినవే-యజసురమునివినుతా॥ శ
౧. చరణాశ్రితసకలదేవ-కరుణాభరణహరీ
ధరణీరమణమురారీ-హరినారాయణశౌరీ॥ శ।
౨. శ్రీనాథాశ్రితఫలదా-శ్రీకంఠనుతపదా
జ్ఞానప్రదనాకధునీ-జనితాబ్జాభపదా॥ శ॥
3. కాలానలసన్నిభమై-శూలముచేఁబూని
వాలాయమునననుఁజంపఁగ-వచ్చుచుండెఁగృత్తి॥ శ॥
౪. నారాయణదాసావన-నాగాధిపశయన
కారుణ్యమహానిధాన-భూరిగుణాభరణా॥ శ॥

కం. అన్నిటికి మూలకారణ
మన్నా నీ మాయ సంశ్రితాభయదాయీ
వెన్నుఁడ నీవే దిక్కని
యున్నాఁడను నన్నుఁ గావు మో లక్ష్మీశా.

కేదారగౌళ - త్ర్యస్రగతి.

పల్లవి. కన్నులననుజూడవేమిరానీ-కన్నదిక్కెవ్వరోసామిరా॥ క॥
అ. ప. పన్నగశయనగరుడగామిరానా-యన్నసర్వాంతర్యామిరా॥ క॥
౧. హరిహరినానేరమేమయాన-న్నాదరింపవానిరామయా
కరుణింపవేరాదయామయాన-న్గాపాడురామారామయా॥ క॥
౨. ఏడనున్నావోనన్నేలకనేర-మేమిరాసర్వపరిశీలక
వేడెదనఘతూలకీలకశ్రీ-విజయనగరగోపాలక॥ క॥

మ. అకటా బ్రాహ్మణులెల్ల భోజనముకై యాసీనులై రిప్పుడే
యిఁక నాయాపదఁ జూచి నీ రశన మెంతే మానుదు న్గానఁ బూ
నిక నిష్కృత్తినిఁ గొంచెమాపు పిదప న్నెట్టు లైనన్సరే
సకలేశా నినుఁగొల్చు దాసున కభీష్టం బిచ్చి రక్షించుమా.

సావేరి - చతురస్ర.

పల్లవి. దీనుఁడనై యుంటి-దెబ్బుననాకొంటి-దిక్కునీవేయంటిరాకృష్ణ॥ ది॥
అ. ప. కానరానీవంటి-కరుణకుఁబుట్టింటిఁ-గావవా వెలినమ్మికంటి॥ ది॥
మి. నేనహాహాయాగజేంద్రుని-తోనుపమకాలేనుభక్తిమెడఁ
గానియతనిఁబోలికడుహంతాత్ము-గానిడుమఁబడితినెట్టులేలెదో॥ ది॥
౧. సకలలోకాధార-సంశ్రితమందార-సరగుననను బ్రోవరాకృష్ణ
ప్రకటదైత్యవిదార-పాథోధిగంభీర-రమణీయకౌస్తుభహారకృష్ణ
ఇఁకేమందునీవంటివానికే-యిట్లార్తులయెడనుపేక్షకలైన
వికలతచెందనీకునీభక్తుని-విజయనగరవేణుగోపబాలక॥ ది॥

మ. సరిగాఁ బెద్దలమాట నమ్మి మదిలో శంకింపకే నిన్ను సు
స్థిరత న్గొల్చుచునుంటి విశ్వజననస్థిత్యంత హేతుప్రభా
వరమేశా యిటువంటి వేళను ననుం భావింపవేని జ్జనుల్
ధరలో నాస్తికు లౌదురీపయి మహాత్మా గాన నన్బ్రోవరా.

భూపాల - ఖండగతి

పల్లవి. నిరపరాధినిడుమఁ-బెట్టనేలావమాని

అ. ప. అరసినన్నాపవద-యాలవాలాకృష్ణ॥ ని॥

ఓ. ధరణీసురులనడిగి-మఱిపారణచేసితి

స్థిరచరపతినీకున్-దెలియని దేమున్నది॥ ని॥

౧. తఱియయ్యోజాగేల-దయఁజూడుమా నన్ను

గురుతుగానీభక్త-కోటిపొగడఁగనిన్ను

బిరబిరఁగృత్తిన్దును-మురసంశ్రితవిలోల

కరుణాకరవిజయన-గరవేణుగోపాల॥ ని॥

గీ. ఇట్లు భక్తుఁడు వేడ శ్రీకృష్ణు చక్ర

ము గడువేగమె కృత్తినిఁ దగులఁ బెట్టి

మఱియు దుర్వాసు వెన్నంటి మంట గొల్ప

మునియు నింద్రునిదరిఁ జేరి మొఱ్ఱ వెట్టె.

వరాళి - త్ర్యశ్ర.

పల్లవి. ఓయింద్రా నేనేమి సేతురానీవు-నాయందు దయయుంచి కావ రా॥ ఓ॥

అ. ప. ఆయంబరీషునికే మొగ్గుసేసి య

య్యో యింక నేమోనపోయి చావఁగవలసె॥ నో॥

౧. నేనెందుకటికిఁబోయితిఁబోయియ-జ్ఞానంపుఁబని యేల చేసితి

మానవనాథునిఁ-బూనితిట్టియిట్లు

కానిదానిఁ జేసి-గడ్డిగఱచితిన॥ యో॥

౨. అతులవిక్రమయుతమీచక్రము నన్ను

వెతఁబెట్టుచున్నదోశక్రుఁడా

బ్రతిమాలినగాని బాధింపుచున్నది

సుతలముఁజొచ్చినఁ-జొచ్చునీడవలె॥ నో॥

౩. భగభగమని మండుచున్న దినన్నుఁ-దగులుకొయిదివదలకున్నది

సుగుణుఁడ నతనికి-శుంఠనై చేసిన

యగణితమగుపాప-మనుభవించన్నది॥ యో॥

౪. నారాయణదాసపోషునివిజయ నగరగోపబాలవేషుని

సారంపుభక్తిని-సతతము నేదపము
సల్పక నేనిట్టులల్పుఁడనైతిన॥ రూ॥

గీతార్థము.

అనుచు గంతులు వైవఁగ నాత్మలోనఁ
జక్రమా నీదు విభుదాసుఁ జాలనొవ్వ
నాడు వీనినిఁ బోనీకటంచు మ్రొక్క-
శాంత గుణభూష దుర్వాస
చక్రము నేమాన్పఁగలనయ్యా నంచేదితాహిత
నక్రము నేమాన్పఁగలనయ్యా
చక్రిచేత నిర్వక్రంబౌ బల-వక్రీకృత దనుజ చక్ర విక్రమము॥ చ॥

గీ. సకల శక్తియుతుఁడు సర్వేశుఁడు స్వగ
తాకారణంబు పరుఁడు గలఁడటంచుఁ
గాన లేనివాని గర్వ మూడ్చును హరి
దాని కేను విను నిదర్శనంబు.

కల్యాణి - మంజరి.

౧. మునునను నందాదియాదవు-లువ్పూజ సేయనున్నంతఁ
గని కృష్ణుఁడు-వారలమతము-న్గాదని యిట్లనె వింత॥
౨. పాలిచ్చి పెంచు గోవులన్-ఫలియించు వనాగములన్
మేలెంచి యర్చింపకిటులన్-మీరొంటు దైవతములన్॥
౩. పూజ సేయ నేలా మూఢులై-పూని గోవర్ధనగిరిన్
రాజిలఁగ నర్చింపవలయున్-రహస్యమిది వినుఁడు మఱిన్॥

సీ. పాతాళగంగ నుపాయంబునం బైకి
రప్పించవచ్చు యంత్రములచేత
మెలపున జీవనదులఁ గాల్వలం దీసి
నీరు వలయు చోట్ల నింపవచ్చు
పర్వతములఁ గలబలు నీటి ధారల
నెప్పట్టులకు నైనఁ ద్రిప్పవచ్చు
వేయేల మఱికొన్ని వెరవులఁ గోరిన

వేళవాన న్గురిపించవచ్చు
కర్మమునఁ గాని దెద్దియుఁ గానరాదు
కర్మమే దైవతము జగత్కారణంబు
కర్మవశమున స్వర్గాధికార మందు
వాని కిటు లంచ మిచ్చుట వట్టివెఱ్ఱి.
గీ. మనకు స్వాధీనమై మఱి మంచి సేయు
నట్టి వానినిఁ గొల్చుట సార్థకంబు
కర్మవశమున నధికారగర్వ మందు
వాని సేవించు టదియెల్ల వ్యర్థముసుఁడి.
మ. అనుచుం బంధుల బోధచేసి మఱి నాయాగంబు మాన్పించి-గో
వనరాజిం గడు వేడ్కతోఁ గొలుచు గోపాలార్భకుం జూచి నే
ఘన కోపంబున మేఘ రాజములపై కన్పిల్చి యిట్లంటి పే
గనులన్నిప్పులు రాలుచుండ నరలోకం బెల్లఁ గంపింపఁగన్.

కన్నడ - నాట - రూపకము.

పల్లవి. అహహాయెంతవిపరీతము-నాగొల్లఁడొనర్చె
అ. ప. మహిలోపలనాయాగము-మాన్పికాఱులార్చె
మి. గహనంబులుపశువులుం-గడునర్చింపఁదగినవఁట
ఇహిహీత్రిభువనేశ్వరుఁడ-నేఁదనపూజకుఁదగనఁట॥ య॥
౧. కర్మమేదైవమనుచు-జ్ఞానముబోధించెన్
దుర్మదముననన్నుమహేం-ద్రునిదృణీకరించెన్
పేర్మిశ్రుతిస్మృతిచోదిత-విధులెల్లవ్యర్థములఁట
ధర్మమెగోరక్షణమఁట-తనమాటలెవేదములట॥ య॥
గీ. భళిర యాడింభ నాస్తికుపల్కు నమ్మి
యాదవులు నన్ను మఱచిరి యవనిలోనఁ
గావున న్నీరు దబ్బునఁ గడు బ్రళయముఁ
బెంచి వారలక్రొంపలు ముంచిరండు.
కం. అనఁగ విని మేఘరాజము
లనూన మహిమంబుల్తోడ నాయాజ్ఞఁబూనుం

డిన ఘోషముప్పై నంతటఁ
బెను ప్రళయము గాఁగ వాన పెల్లుగఁ గురిసెన్.

సీ. గాఢాంధకారంబు గ్రమ్మఁగ భయపడి
యొండొరులం బిల్చుచుండు వారు
ఇండ్లకప్పులు మింటి కెగరించు గాలికి
నోర్వఁ జాలక భూమి నొదుగు వారు
మెఱుపులతోఁ బుట్టు మేటి పిడుగుల
మ్రోతలకు మూర్ఛ పోవు వారు
సన్న తొండములంత లేసి ధారలఁ బడు
వానకు వడవడ వడఁకు వారు
అకట యిది యేటివిపరీత మనెడు వారు
ప్రళయకాలం బిదేయని తలఁచు వారు
అశన నిద్రల నెఱుఁగక యడరు వారు
నగుచుఁ గృష్ణుని వేడిరి యాదవు లిటు.

ముఖారి - త్ర్యస్రగతి.

పల్లవి. చిన్నికృష్ణా వేగ రారా మముఁ-గన్నులెత్తి చూడవేరా॥ చి॥
కన్నతండ్రి నీకన్న దిక్కెవ్వారు-కలరో భక్తమందారా॥ చి॥
౧. ముణుఁగుచున్నవి కొంపలెల్ల యే-మూలనున్నావయో చెల్ల
ప్రళయకాలము వచ్చె-ప్రాణంబులకు దెచ్చె బాడు దైవంబికే వల్ల॥
౨. ఉన్న సొమ్ములు పాడువారెమన-యూరెల్ల చెర్వ్వాగామాఱె
అన్నన్న యింకేటి యీసమాపని దీఱె-నందబాలకి కిబస్తు చేకూరె॥ చి॥
౩. ఇంత వఱకు ప్రోవ్వవలేదా మ-మ్మిపుడు విడుచుట మర్యాదా
పంతమా మామీఁద బాలగోపాలనీ-భక్తులము కాపాడరాదా॥ చి॥

చ. కులమునఁ గల్గు ధర్మమునకు న్బ్రీతికామ్యుల గాఁగఁ గొండకున్
జెలువుగఁ బూజసేయుచు శచీవిభుని న్నిరసించి నందుచే
గలిగెను ముప్పు నీవు మముఁ గాదని క్రొత్తమతంబు మప్పి యి
ట్లలజడి మాన్పవేల తగునా యిటు సేయుట నందబాలకా

గీ. అనుచుఁ బలవించుచున్నట్టి యాదవులకుఁ

బాలుపు మాలిన పసుల మందలను గాంచి
యెంతయుం గరుణించి శ్రీకృష్ణు డంత
నాదు గర్వం బడంపఁగఁ డాఁదలంచి.

మోహన - చతురస్రగతి.

పల్లవి. గోవర్ధనగిరి కేల నెత్తెన్-గోవిందుండంతన్
అ. ప. చేవఁగనుంగొని మిక్కిలి నేనున్-సిగ్గుపడఁగ నింతన్॥ గో॥
మి. ఈవైపున రండు మీరలందఱు-నించుకైన వర్ష బాధ చెందరు
గోవులతోడుత దలిదండ్రులార-కుఱ్ఱలార పెద్దలార యనుచున్॥ గో॥
౧. తనదు చేయి కామగాఁబై-ధరాధరంబుస్సుబ్బఁగా
ఘనవితానమామీఁదబట్టఁగా-బెనుముత్తెములాంచుక్కుచిన్కఁగా
గొనకొని మిక్కిలి కుఱ్ఱడు పేడున్-గొండ దొడ్డదని శంకింపకుఁడీ
పనివడి నాదగు కేలల్లాడదు-బ్రహ్మాండ మెల్ల పైఁబడనీయని॥ గో॥

తెరువోజ.

మొగి నేఁ డహోరాత్రము ల్కొండ గొడుగుఁ బ
ట్టిన బాలుండె పరమాత్ముఁడనుచు
నొగి నాయహంకార ముడిగి మేఘముల
మఱలించుకొంటినో మహేంద్ర నీవు
నగధరభక్తుని బాధఁ బెట్టితివి
ఘనతపోనిధి నని గర్వంబు మించి
మగుడుము నాచేత మానదీ మంట
యనఁగ బ్రహ్మం జేరి యాముని యనియె.

హరికాంభోజి - త్ర్యశ్రగతి.

పల్లవి. సరసిజోద్భవ కావవే-చక్రాగ్ని మఱల్పవే
అ. ప. హరిదాసుని దూఱి నేస్వా-యంబుగనుపగుల్చుకొంటిని॥ స॥
౧. మంట లెత్తుచున్నది-మానవనంచునున్నది
తుంటరి వని యన్నదినను-మంటఁగలయుమన్నది
కంటఁజూడవేమయో-కమలజాసనధర్మమా నీ
వంటివాఁడిట్లు నిర్దయ-నుంచెనా గతిమంటలకె॥ స॥

౨. నారాయణపోషునివిజయ-నగరవేణుగోపాలుని
మేరుమందరధీరునిజిత-మేఘనీలవర్ణుని
పారముగాఁగొల్వనీక-చావఁగ్రాసితివవిధీ॥ స॥

గీ. అనుచుఁ దలడించు దుర్వాసు నబ్జభవుఁడు
గాంచి యిట్లనె నోయయ్య గర్వ పడెదు
వానిదర్పం బడంచు శ్రీవల్లభుండు
దానికిన్నీను నేను నిదర్శనంబు.

ఆరభి - ఝంజరి.

౧. శ్రీకృష్ణుడుబృందావనములోఁ-జెలఁగిమహిమలఁజూప
లోకస్రష్టననినాకా-లోనన్గర్వముదోఁప
౨. హరినివంచించుటకుమాయచే-నాగోపాలశిశువులన్
సరగునదాఁచితిన్గిరిగుహన్-జయ్యనమేయుపశువులన్
౩. నారాయణుఁడఖిలజ్ఞుఁడుగా-ననాలోంచెతనమునకున్
మాఱొనర్పుటబ్రహ్మయ్యావే-మాఱునామనంబునకున్.

చ. ఇరవుగ నేను మాయ మొనరించిన గోవులు గోపబాలకుల్
సరిగ మురారి తానె యయి సంజత త్తిన్నటి యున్కిపట్లకున్
మరలెను దొంటిపూడ్కిఁ గడుమందను దొల్లిటికన్న మీరె న
చ్చెరువుగఁ బ్రేమ దానిఁ గని సిరి మదిన్దలపోసె నిట్టులన్.

బేహాగ్ - చతురస్రగతి.

పల్లవి. ఏమోహమాయనా-కెద్దియుంబాలుపోదామె॥ నే॥
అ. ప. ఈమందకునేఁడుమల్లిపసుల-నీబాలురఁదలపోయ
నాముమ్మునుతమ్మునింజూచినటుల-నాకానందంబాయె॥ నే॥
౧. పసులకాపసులకుదివ్య-వర్చస్సెటులుగలిగె
పసులకున్నసహజమూఁఢ-భావమెట్లుతొలఁగె॥ నే॥
౨. మొదవలచన్నుఁగుడిచిమాంస-ములమానెబెబ్బులులు
పదరిగొల్లపిల్లలెల్ల-పల్కుదురుపనిషదర్థములు॥ ఏ॥

సీ. అలకాపులతల్లులు లంపటులు మూఁ యశో
దమ్మలీవిం జెలువారు చుంద్రు

మముఁ గన్న నందయ్యమాడ్కి నీ గొల్లపి
ల్లల తండ్రు లందఱు చెలఁగు చుండ్రు
పడపడి గోపాలబాలు రెల్లరును నా
తమ్ముని లీలను దనరు చుండ్రు
మఱియు గోవృషవత్సమణ్డలి యంతయు
న్దివ్య తేజంబున న్వెలుఁగు చుండు
సర్వమిది యెదో కాని యపూర్వసృష్టి
యిందు కూహింపఁగాఁ గత మేమి యొకొ
యౌను సకలాదికారణ మైనకృష్ణు
మాయ నెఱుఁగంగఁ జాలుదు రే యితరులు.

కం. అని శేషుఁ డయ్యె హలి కృ
ష్ణునిమాయం దెలియలేక చోద్యము పడఁగాఁ
జనియె నొకవత్సరము నం
త నే నహంకార ముడిగి తగహరి కంటిన్.

ధన్యాసి - ఏకతాళము.

పల్లవి. జయజయజయగోవిందాకృష్ణా-జయజయ శౌరిముకుందా॥
అ. ప. జయజయజయనిశ్రేయసకందా-జయజయపరమానందానందా॥
మి. దయాసముద్ర నేబ్రహ్మనని యెంత-యో పొగరించినీమహిమసుం
తయుం దెలియలేకతప్పు చేసితి-దామోదరమన్నింపుముతండ్రీ॥ జ॥
౧. అఖిలజగన్నాటకసూత్రధారి-హరిగోపాలమురారి
నిఖిలదుర్జనమదాపహారి-నిరతాశ్రితమనోభీష్టకారి
సఖుఁడాయనిబంధుఁడయనిమఱిర
క్షకుఁడాయనినిన్బిలుచుచునీదుస
ముఖమునఁజరించుగొల్లలపుణ్యము
పొగడఁదరమె కేశవనారాయణ॥ జ॥

సీ. నీవె సర్వంబని నిశ్చయించినవాఁడు
భవరోగ మంటకో పద్మనాభ
తఁదివనామామృతము గ్రోలువాఁడిహ

భోగంబు లొల్లఁడో భోగిశయన
నీపదాంబుజభక్తి నిరతుఁడౌ వాఁ డన్య
కర్మము ల్సేయఁడో జ్ఞానరూప
నీదు దాసులతోడ నేస్తమందినవాఁడు
పరుల సేవించఁడో పరమపురుష
నీవలన బ్రతుకు న్గాంచు నేను నిన్ను
మోసపుచ్చఁగఁ బూనితి మూఢుఁడ నయి
అక్కటా గ్రుడ్డు పిల్లను వెక్కిరించు
నట్లు మాధవ గోవింద హరి ముకుంద.

ద్విపద. హరి నిటు వేఁడి తదాజ్ఞను బొంది
మరలితి నింటికి మఱి బుద్ధివచ్చి
కావున నీతపోగర్వంబు మాన్ప
శ్రీవరుఁ డిటు నీకుఁ జేసెను శాస్తి
నాతరమా మాన్ప నాయబ్జశక్తి
నో తాపసేంద్ర పో మ్మొండు-చోటునకు
అనవిని కైలాస మరిగి యీశ్వరుని
మనుపవే యని వేఁడె మౌనియు నిట్లు.

నాగస్వరావళి - త్ర్యస్రగతి.

పల్లవి. ననుఁగావవేగ రావ దేర-నాగభూషణా-నగజాత్మతోషణా
అ. ప. సనకాదియోగివంద్య బాల-చంద్రభూషణాశ్రిత
జాలపోషణాభవశోషణా॥ న॥
౧. నేర మేమి రాగిరీంద్రచాప-గారవించరాకని-కారముంచరా
ఘోరచక్ర పావకునిఁజ-ల్లారఁ బెట్టరానీకు
మేర గాదు రా కరుణాకర॥ న॥
౨. విజయనగరగోపబాలసఖుఁడ-వెతలఁ బాపరా వేద
వేద్యకాపరా-గజచర్మవసనప్రోవరాము
డన్నలదొర రామలింగేశ్వరాజగదీశ్వరా॥ న॥

గీ. అనుచు వేఁడునతని కాహరుఁడనె ముని
ముచ్చ నీవు కడుఁ దపోనిధి వని
విఱ్ఱవీగి యిట్లు వెత తెచ్చుకొంటివి
వలదు గర్వ మెంతవానికైన.

మంజరి - జెంజోటి.

౧. వినుముతొల్లినాకడకుశ్రీ-విభుండొకనాఁడురాఁగ
వినుతిచేసియిట్లంటినాస్థైర్య-విభవముచూపఁగ బాగ॥

౨. ఆఁడుదానవైయల్లనాఁడుసీ-వసురులవలపించుగతి
నేఁడునీప్రజ్ఞచూపినన్నభ్రమ-న్బెట్టఁగలవెశ్రీపతి.

౩. అనుచగర్వపడిమీసముందువ్వి-హాస్యముగానేఁబల్క
వనజాక్షుఁడునాతోనిట్లనియెం-బలుమఱుచిఱునవ్వొల్క.

ఉ. కాముఁ ద్రెంచినావు మఱికంఠములో విష ముంచినావు బ
ల్పాములఁ దాల్చినావు సులభంబుగ మృత్యువు గెల్చినావు మ
ద్భామి వసించినా వహహా పుఱ్ఱెను జేత ధరించినావు నీ
జామ భ్రమింప సేయుటెటు స్థాణుఁడ నిర్జిత పంచబాణుఁడా.

గీ. సగము మగవాఁడ నీవు మీసమ్ము దువ్వి
నన్ను నెగతాళి సేయు మెంతయును నవ్వి
ఎంతవాడను నిన్ను భ్రమింపఁ జేయ
దిస్సమొలవేల్ప సెలవిమ్ము తిరిగి వత్తు.

చ. అని వనజాక్షుఁడుం జనియె నాతని మాట పరాకు జెంది నే
నును జరియించు చొక్కెడ వినూతన గానసుధామధుస్వనం
బనుపమమై వినంబడఁగ నాస్వర మెవ్వరిదో యటంచు వే
గను గొనఁగోరి యొక్కదెసఁ గాంచితిఁ బూవులతోట నొక్కటిన్.

బిలహరి - ఆదితాళము.

పల్లవి. ఆపూఁదోటపసందుంజూఁడఁగ-నద్భుతంబయ్యె నెమ్మదికహహా॥
౧. ప. ఆపర మేష్ఠివిలాసమెట్టిదో-యదియపూర్వమనుపమానందకర॥
౧. ఏవైపుఁజూడఁదిన్నని వరుసల-నెసఁగుచెట్లదిఁ గేలఁబూదలన్
పూవుపిందెదోరగాయపండుల-పుష్పాడితావి తేనియలబాదలన్॥

౨. చినుకులంజిమ్మునీటిజంత్రముల-చెంగటనున్నలతాగృహముల్
మణిమంటపములుచల్లనితెమ్మెర
మలపుగొలనులాచుట్టువిగ్రహము॥ ఆ॥
3. త్రోవలకిరుదెస-దొడ్డతివాసుల-శీవినిమొలచినలేఁతపచ్చిక
యేవిధనైనంజెప్పదరమియా-త్మైకవేద్యమనుచున్సరిపుచ్చక॥ ఆ॥

సీ. చెరుసగ మెలమావిచివురు నోళ్లం బట్టి
కోలుకుచుం గూసెదుకోయిలజత
పగిలినదాలిమ్మపండుగింజల ముచ్చ
టలు పల్కుచుం దినుచిలుకలకవ
పూఁదేనె నొండొరు పుక్కిళ్లఁ ద్రావుచు
జంటగా నెగిరెడు తేంట్లజోడు
తీఁగెయుయ్యెలమీఁద నూఁగుచు ముద్దులు
గునియు చుండెడుపాలగువ్వలదుగ
జెంగ మలరింప నత్తోఁట యందుఁ జేరి
యచటి వింతల కెంతయు నబ్రమంది
చెన్ను మీఱఁగఁ బాలరాతిన్నెమీఁద-
బంతి యాడెడునొక్కజవ్వనినిఁ గంటి.

కమాచి - చతురశ్ర.

పల్లవి. ఏరీవాహ్వారీయా-నారీమణికిసరి-యీరేడులోకంబుల-వే
సారిగులుకుమిటారిమదనునికటారియొయ్యారియదోరీజడదారి॥
౧. తొయ్యలినెమ్మోముపున్నమచందురు-దోసిరాజనిపించురా
వయ్యారికొప్పుచమరీమృగవాలము-పైకోతకోయించురా॥ యే॥
౨. తెరవబెదుర్చూపులేడిపిల్ల-దృష్టింగిడ్డనిపించురా
తరుణికెమ్మోవియుదొండపండునొక-తాకునగూలించురా॥ యే॥

సీ. చిఱుగుంట కల్గినచెక్కిలి తోడుత
నద్దిరా యద్ద మెట్లగును సాటి
ముక్కుఁ బ్రక్క మొదలు మోవిమూలల వరకు
బొల్పారు వంక కేపోల్కి గలదు

హాయలుఁగ బల్కాలు నొకవైపు గన్పడ్చు
పిన్న నవ్వున కెటు వెన్నెల మెన
నడుమ చక్కనినొక్క తొడరినగడ్డము
పొలపున కెద్దాని బోల్పవచ్చు
భళి రయాత్మైకవేద్యస్వభావమహిమ
నుపమ లుత్ప్రేక్షలుం దమ యూహఁ బన్ని
తప్పఁ బల్కుట గాక సత్యమన దరమె
యజున కైనను మఱివాని యబ్బకైన.

కం. ఆయందం బాచందం
బేయంగన కైనఁ గల్గనే యిజ్జగతిన్
నాయంత వాని కౌరా
రా యాత్మజ్ఞాన ముడిపినది యే మందున్.

కం. దిటవు దొరఁగి మూఢుఁడనై
కుటిలాలక చెంతఁ గొంత గ్రుమ్మరి పిదపన్
దటుకునఁ బెదవులు తడుపుచు
నిటు లంటి విరాళిఁ జెంది యీశుఁడ నయ్యున్.

శ్రీరాగము - మిశ్రగతి.

పల్లవి. ఎవ్వారిదానవీ-వెందుకొంటిగనుంటి-వీపూవుఁదోటనోబాలా॥
అ. ప. క్రొవ్వాడివాల్చూపుకోలలనామెద-గ్రుమ్ముచుంబలుకవిదేలా॥
మి. నవ్వావేమేసరసమునకుంగా-ల్దువ్వావేమే
యివ్వనంబునంబుననీదుబిగిలే-జవ్వనమురిత్తగానేటికి॥ ఎ॥
౧. నినుఁజూచినంతనన్బిడింపఁజొచ్చెదొం-టివైరముచేమారభూతము
నినువంటిచక్కని-నెఱజాణన్గూడకుం-డిననబ్బుబెట్టులద్వైతము
ఎనయరావేవేగమెన-న్నేలుకోవే
మనసుదీరనిన్గాఁగలింపకమానన్బ్రహ్మా-జ్ఞానమానన॥ మె॥

సీ. నీజడ జ్జూచిన న్జిలువఁ జేడు స్ఫురించె
రంగదుత్తుంగసారంగగమన

నీనెన్నుదురు గన్న నెలవంక తలఁపయ్యె
రాజితభీతసారంగనయన
నీవళు లరయ గంగావీచికలు తోఁచె
రమ్యవిలోలసారంగచికుర
నీ కౌనుఁ గాంచిన మిన్ను జ్ఞప్తికి వచ్చె
రమణీయబాలసారంగపాణి
చెలువములఁ గొంత పోలిక కలదు మనకుఁ
గాని యిసుమంత యైన నామానసంబు
మాడ్కి నీమన సున్న మన్మథునిపీడ
నన్ను సోఁకుట లెట్టులో సన్నుతాంగి.

వ. అనుచు నేఁ బల్కుచుండఁ గ్రొవ్వాఁడి వాల్చూపు గాలమునం దగులు
కొన్న నామనోమీనంబు న్జప్పునం బైకి లాగి తన మిటారంపుగబ్బి
గుబ్బజక్కవలకు న్విందొనర్చి జాతి పోసియన న్లోయారంబుగఁ
బయ్యెద సర్ది క్రియాశూన్యుండ చాలుచాలు నీమాటల సరసమని
యెగతాళి సేయుగమనిక నిక్కల్జడ కుచ్చు ల్దూఁగాడ నీవా మన్మథుని
జయించినా వని యీసడించుగతిఁ జిఱునవ్వు నన్మాతి విరిచి సరిసరి
జగద్గురుండవ విదియా నీయాత్మజ్ఞాన మని నిరసించు లాగునం జట్టలం
జరిచి బాగు బాగు నిక్కముగ నిందు మగవాఁడ వైన నం జిక్కించు
కొమ్మన్నట్లు చెంగున గురంగము వలెఁ దాటి పర్విడుచు నిన్గూడక
మాన నని బీరంపుఁ బల్కుల వెంటఁ దఱుము న న్మాటిమాటికి బెదురు
చూపుల వెన్దిరిగి చూచుచుఁ బంతంబున వేగంబు రెట్టించి యిదె
దొరికితివి దొంగయని సమీపించు నాచేతి కందీయందనిలాగున నక్క
చిక్కులం బర్విడుచు నాఁడుదాని పాటిపర్వు లేకుండెనే యను చిన్న
తనంబును దొల్లింటి పగ రెట్టించి సమూలంబుగ మద్ధైర్యము న్గబ
ళించి మదించి మించి భూతపతి నయ్యు నన్బ్రిడించు మారగ్రహోగ్ర హో
గ్రతం దలంచి మిక్కిలి భయంబును రాళ్లప్పలు గట్టుపుట్టలు మిట్టు
పల్లంబులనక యిట్టికుసుమ కోమలి యెట్లు నన్నతిక్రమించి పరుగెత్తు
చున్న దిదేమాయయో యని యాశ్చర్యంబును ముప్పిరిఁగొను డెం

దంబున నే తెంచు నన్నని చెక్కు టద్దంబుల ముత్తెపుం జెమ్మటలు వార గాలి విసరునం బైయెద జార నోరోరి నెరజాణ బావా యని ముద్దు లూర నన్నిలుచుచుం బొదల చాటునం బలుమఱు దోబూచు లిడుచు మేల్మి బంగరు నెమ్మేనం జీరె సవరించుకొను నెపంబున నవయ వంబు లోకకొంత వెలిపుచ్చి నామనసప్పుడప్పుడు బెల్లించుచు మిగుల డస్సి యలసియుం బరువున కైదేవులాడి వచ్చు నాకుం గొన్ని యడుంగు లెదుర్వచ్చి యార నేం గోరిన వన్నె కాండ యింక నీకోరిక యేదీ నీప్రేమయా యగుపడు నేటి యావలి యొద్దువఱకు నన్నెత్తు కొనుము పిదప నాయిసుక తిన్నె మీంద నని యేమో చెప్పంబోవుచు న్నంతలో సిగ్గుపడి ముమ్మరంపు మోహంబునం గనులు తేలవైచి నా కౌంగిటం బడునంత దగ్గర యైనం దత్తఱంబునం గ్రుచ్చి కౌంగలింపం జనునన్వారించి చేతి కందక చప్పున బాటి పోపోర సామి నీకెంత యూ సరా యని పక్కున నవ్వి సికతా తలంబుం జేరి యిక దబ్బున రమ్మిది యెంత మెత్తని పాన్పో చూడు మనుచు నేం దారసిల్లినకొలందిం దా దూర మగుచుం దుదకు వేల్పుసానులు కొల్వనిందు కొల్వున్న పార్వతీ సమీపంబు డాసి యో సోదరీ పరికించు మెంతవాం డెట్లు భ్రమం బడెనో యని నిలుచున్నతఱి నేం గామాంధుండ నై యొయలుంట యెఱుంగ కప్పాంబోడి న్గౌంగిట నదిమినంత.

సురట - చతురశ్ర.

పల్లవి జయవిజయాభవయనిగోవిందుండు-స్వస్వరూపమందెన్
నేనెంతయుసిగ్గునఁదలవంచుకొంటిలలి-తయద్భుతముచెందన్ ॥ జ॥

అ. ప. దయయుంచుమునాతప్పునైనుమిం
తటిశ్రమంబెట్టితినినుజగద్గురుండ
విడు తెక్కొకనీవెయిట్లుభ్రమపడ-వేరెయొరులం జెప్పనేలశివశివ॥ జ॥

కం. అని పల్కెడునారాయణు
వినుతించితి నేను మిగుల వినయముతోడన్
[illegible] జనిమొనతందున్గావున
[illegible] మునినాయక నీవు గర్వము న్మాను మికన్

గీ. అనుచు బుద్ధి చెప్పి నాశివునకు మ్రొక్కి-
మునియుఁ జనె వికుంఠమునకు నంత
అహహ యాపురంబు మహిమల వర్ణింపఁ
గలుగు కవిత సార్థకంబు గాదె.

వ. ఇట్లు దుర్వాసుండు కైలాసంబు విడిచి తనతపోబలంబున మింటి కెగరి సకల గ్రహమండలంబుల నొక్క క్షణంబున దాటి సప్తోర్ధ్వ లోకంబు లతిక్రమించి గాఢాంధత మిస్రముం జొచ్చి నిముసమునకు శతకోటి యోజనంబుల మేరఁ జనుచు నారుమాసముల కాకటికి చీఁకటి న్గడచి యవ్వల నెద్దెన నైన దెరపిచూపక బాలసూర్య ప్రభాభాసమానంబై నూఱామడలు వెడల్పుగల యొక రత్నప్రాకార కుడ్యము న్నిర్గమించి పిదప వేయిక్రోసుల దవ్వొక యద్భుతారణ్యంబున నరిగి యవ్వెనుక ప్రతిదినంబు నాల్గుగంటల కొకరుచివంతున షడ్రసంబులం బాఱుచు నేబదివేల గజంబుల వెడల్పునఁ బ్రవహించు నదిమధ్య మొదటఁ దొంబది యామడల చుట్టుకొలఁతఁ గలిగి యతుకు లేక గుల్లగాక లావు సన్నంబుల కొలఁత వరుసగ సమంబుగా వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత పద్మరాగ హరినీల ప్రవాళ మౌక్తిక రూపంబులం దొమ్మిది భాగంబులఁ బరిణమించు నొక్క ఘన రత్నస్తంభ మొకయడుగు పొడవైనకొలఁది నొకయడ్గు వెడల్పుతగ్గుచు దుద కొకయడుగు మాత్రమే మిగులునంత యున్నతంబై వెలయుచుండ నాద్దాని శిఖరంబున నలుచదరంబుగ శతయోజన పరిమాణంబై వెలయు వైకుంఠపట్టణం బందన్ని జంతువులు స్థావరభక్షణంబు సేయుచు జరామరణంబులు లేక జ్ఞానభోగంబుల న్సమానములై సర్వజ్ఞత న్వెలయుచు నిత్యసుఖానుభవమున దేజరిలుట బొడఁగాంచి యమ్మునివరుం డద్భుతామోదములం దగిలి తనమనంబున నిట్లు వితర్కించె. నద్దిర యిందలి చిరజీవులెల్ల నవయౌవనంబున నలరారి యపరిమిత సంఖ్యకలిగి సమవయస్సుల నొప్పారి సొగసున నొండొండుమీఱి స్త్రీపురుష వ్యక్తులు సమానసంఖ్యం జెలఁగి స్వాధీన దేహేంద్రియంబుల భాసిల్లుచు నణిమాదిసిద్ధులం దేజరిలుచు యథేష్ట

సుఖంబుల నెగడుచుఁ బరస్పర మైత్రిందగిలి స్వేచ్ఛానుసారంబుగ నహర్దివంబు మూడువంతులు నిద్రాహార విహారంబుల నడపి మిగిలిన కాలంబున నవవిధభక్తిమార్గంబులఁ బరమపురుషు నారాధించుచుంట యత్యాశ్చర్యంబయ్యె. మఱియు నిందలి స్థావరంబులు తరుగువిరుగు లేక సర్వకాలంబులం జంగమాభీష్టానుకూలంబుగఁ గాచిపూచి పండుచుండెడు. వెండియు నిప్పురవాసుల కెల్లలోకంబుల రహస్యంబులు దేటతెల్లంబుగఁ దెలియబడుచుండు. ఈపుటభేదనంబు సకలభువనంబులకాధారం బింకఁ బెక్కేల యిందలి ప్రజలకుఁ గోరినపుడు శ్రీపతి ప్రత్యక్షంబగుచునుండు నని సంతసించుచు సంతతంబు చలువనీటి తుంపురులం జిమ్ముజలయంత్రములకు నీరందిచ్చు నమృత ప్రవాహంబుల కిరుదెస దిద్దినలేఁబచ్చిక బీడులమేయుచు నిరతరంబుకోరిన ప్రాణికోట్లకుఁ బాల్గుడుపు కామధేనువుల పొత్తున నంభారవంబు లొనర్చు వృషభంబులు చెలరేగి కొమ్ముల విదల్చు పచ్చిపసిఁడి మంటి దిబ్బలపై నానావిధమధుర పుష్పఫలభరితంబులగు వృక్షంబులమీఁద సకలవేద శాస్త్రపురాణేతిహాసంబులంబల్కు పక్షులకుఁ దూఁగుటుయ్యేలలుగఁ దీఁగెలల్లు పొదరిండ్లలో మెత్తని బంగరుటిసుక పరపులం బడగలెత్తి యాడుపాములకుం జలువ దెమ్మెరల విందుసేయు కొలనులం గమ్మతావులీను కల్వదామరపూల తేనియలుగ్రోలి ఝుంఝుమ్మని మెగురు తుమ్మెద బారుల నీడలన నొప్పారు శైవాలపుంజమ్ములల్లాడఁ దళుక్కునఁ దోఁకలు మెఱయించు బేడిసలకు మెల్లనినడలు మప్పు తాబేళ్ల మూపులంబడవషికారుసేయు రాయంచలు ద్రుంచుమృణాల శకలంబులం జుట్టంచు కట్టునొడ్డులందూరి నీళ్లుత్రాగు వేళ్ల బెరుఁగు కొబ్బరి చెట్టులచుట్లు నలరు ననంటితోటల నడుమ దివ్యసౌధాంతరంబుల హంసతూలికా పర్యంకములందు సల్లాపంబులునల్పుమిథునంబులం జూచుచు నెట్టకేలకుఁ బురమధ్యమమునం గోటగుమ్మము ముందు గావలియున్న గరుడు ననుమతివడసి లోనికిఁజొచ్చి పరమహంసల పహారాలుపన్నెండుగడచి యొకదివ్య సౌధాంతరంబున నచ్చరలు నురటీలు విసర భాగవతోత్తములు బరాబరులుసేయ శేష

శయ్యా ప్రస్థాన నిందుకొల్వుండు శ్రీనారాయణుం జేరి మ్రొక్కి యు[illegible]

శుద్ధకాంభోజి - చతురశ్ర.

పల్లవి. సరసిజాక్షకరుణాకరరావే-చక్రజ్వాలలసమయింపఁగదే॥
అ. ప. మురదానవహర మొఱవినవలదె-బిరబిరనార్తునిమనుపంగగదే॥స॥
౧. నీదుభక్తునిదూఱితినేను-నీఘనచక్రముపాల్బడినాను
నీదాసులపై కెన్నఁడుపోను-సాదరమునసీచలమిటుమాను॥ స॥
౨. తెలియకచేసితిదయయుంచఁగదే- దేవదేవనీవాఁడనేగదే
చలమిఁకఁజేయకుకరుణించఁగదే-సత్యముచక్రముచంపుఁగదే॥స॥
3. నారాయణదాసావనలోలా-నగధరవిజయనగరపరిపాలా
భీరముచెడితినిబ్రోవవేలయా-భీరవధూపాలాగోపాల॥ స॥

గీ. తుచ్ఛబుద్ధి నీభక్తునిదూఱి వెంటఁ
దెచ్చుకొంటిని పెంజిచ్చు దేవదేవ
చచ్చిపోవుచునున్నాఁడఁ జక్రముననుఁ
మచ్చిక న్బ్రోవరావే రమాహృదీశ.

కం. అని నేలఁ బొరలుచుండిన
మునివరునింజూచి కొంత ముదమున విష్ణుం
డనియెఁ జిరునవ్వు నవ్వుచు
సనకాది మునీంద్రులెల్ల సన్నుతిసేయన్.

అఠాణా - రూపకము.

పల్లవి. ఏమిచేసెనంబరీషుఁ-డెంతయోమంచివాఁ॥ డే॥
అ. ప. తామసించికీడుసల్పఁ-దగునేనీవంటిమౌని॥ కే॥
మి. భూమిసురుఁడవుసర్వస-ముండవుమౌనీంద్రుండవు
నీమముచెడినిర్దయతో-నిరపరాధునొంపనేల॥ నే॥
౧. పట్టినేరమెంచినాదు-భక్తునింబాధించినావు
కట్టికుడువకుండునేస్వ-కర్మమెంతవారికైన
నెట్టనసుగుణములఁబుట్టి-నేలనెల్ల నేలుజెట్టి
అట్టిదయామృతపుచట్టి-యారారానాభిపట్టి॥ యే॥

గీతార్థము.

నీరు పల్లములందుండు తీరుమెరయ
భక్తులావారి మనముల బలసియుండు
నేనెభక్తులు భక్తులె నేనటంచు
తలఁచుకొను వేగదుర్వాస-దమవినాశహాసవిహీన
క్రమముఖవికాసా-విమలుఁడౌనంబరీషునిపద
కమలములఁబట్టుమాయాతఁడు-నిముసమునఁ
జక్రాగ్ని మాన్పుచు-విమలబుద్ధినినిన్నుఁగాచును॥ ద॥

కం. అని బుద్ధిగఱపు నారా
యణు పాదంబులకు మ్రొక్కి యమ్మానిం(?)బ్రమం
డనలేని బాధఁగుందుచుఁ
జనిచని భూవిభునిఁగాంచి చయ్యనఁ బలికెన్.

శుభపంతువరాళి - త్ర్యస్రగతి.

పల్లవి. చచ్చిపోతినేభూప-నొచ్చుచున్న దే॥ చ॥

అ. ప. చచ్చిపోతిఁజక్రపుమంట-మచ్చికంజూడుమాకంట
పెచ్చుగనెన్నఁడికవెంట-తెచ్చుకొననిటువంటితంట॥ చ॥

౧. కనులఁజూడవేభూప-మనఁగఁజేయవే
వనజనాభునిభక్తుఁడవని-కనుఁగొనలేనైతినయ్యో
తినియెదనీయెంగిలైన-దిక్కుచూడవేభూప॥ చ॥

౨. పొట్టఁజీల్చుచున్న దెవిడిచి-పెట్టనంచున్న దే
ఒట్టుపెట్టుకొన్నవాఁడ-నొరులజోలికిఁబోనటంచు
నెట్టననీపాదములను-బట్టుమునలిబడుగునయ్యో॥ చ॥

౩. ఎందరివేడితినేనే-నెంతకుయ్యిడితినే
అందఱునోమందుఁడాగో-విందభక్తునిదూఱితెందుకు
క్రిందుమీఁదెరుఁగకటంచు-నిందించిరికానికావరు॥ చ॥

ద్వి అనితనపదములనంటెడుమునిని
గనియంబరీషుండుకరుణనేపారి
కరములతోనెత్తితమియంపుమనుచుఁ

బరువడిఁగన్నీరుపటమునన్ ఱొత్తి
కదుఁగేలుమోడ్చి చక్రమ్మునుగాంచి
వడివడిఁదానప్డుప్రార్థించెనిట్లు.

నవరోజు - చతురస్రగతి.

పల్లవి. తప్పుసైచుమా-తపసినిగావుమ-దామోదరుచక్రంబ
తమోపహారమాయఘతమోపహారమా
ఎప్పుడునినుఁబ్రార్థింతునీ-వేశరణనిమదినెంతు॥ త॥

అ. ప. గొప్పవాఁడితఁడుతనదుకర్మమునఁ-గుందుచుండెనయయో
మిక్కిలికుందుచుండెనయయో॥ త॥

౧. శౌరియాయుధంబా రాక్షస-జాలతూల ఘోరదహనమా
కృపాయతనమానిర్మలకృపాయతనమా
క్రూరగ్రాహమారకమాసం-సారాంభోధితారకమా
భూరిసుజనసంపూతహృదయస
మ్మోదదాయకంబాసుజనసమ్మోదదాయకంబా॥ త॥

౨. కరుణనింకఁగొనుమామానిం-గాచినాదుమనవినివినుమా
[illegible]
స్ఫురద్వేదవేదనమాపరమ-పురుషముఖ్యసాధనమా
విరించినుతమాశ్రీవిజయనగర
విబుధపాలితంబాసంతతవిబుధపాలితంబా॥ త॥

ఉ. జ్ఞానము నీవుతత్త్వము నిజంబుగ నీవఖిలప్రపంచమున్
బూని సృజించి పెంచి లయమున్ ఘటిసేయుదు వాత్మలీలకై
జానుగ భక్తరక్షణము సల్పుచునుందువు నీమహత్త్వమున్
నేనెఱుఁగంగ శక్యమవినిర్జితనక్రమ విష్ణుచక్రమా.

గీ. అని నుతింప సుదర్శన మరిగెనంతఁ
దపసితో బారణముచేసె ధరణివిభుఁడు
మఱియు దుర్వాసుఁ డారాజమౌళిని గని
యెంతయు స్వంతసించి తా నిట్టులనియె.

సింధూరా - చతురశ్రగతి.

ల్లవి. ఎలమిభాగవత శేఖరనిన్నని-తృప్తిచెందెనామనసు

ప. కలుగుఁగాతనీకిష్టసంసిద్ధి-కమలనాభుముద్దుపట్టివైతివి
భళిభళిభళిభళిరానీమహిమము-భళిభళిభళిభళిరా॥

౧. పోల్చుకొనుమునాకున్నెయహంకృతి-పుట్టునన్యాసినిగనుక
పెల్చునసీయశముసుముజ్జగముల-వెల్లడింపనీలీలఁబన్నితిని॥ భళి॥

౨. వినుతసద్గుణస్తోమత్రిభువన-విదితనామనీకథను
వినెడివారలకభీష్టసంపదలు-విజయనగరగోపాలుఁడొసంగుత॥భళి॥

కం. అని మునివరుండు చనియెన్
వనజాక్షుని గొలిచిపుగుల వన్నెయువాసిన్
గొనియంబరీష భూపతి
చనియె న్వైకుంఠమునకు జాయాయుతుఁడై.

సురట - మిశ్ర.

పల్లవి. కందర్పశతకోటిసుందరధృత-మందరధృతమందరనందిత
బృందగోవిందామంగళమ్మునీకు-మంగళమో॥ కం॥

౧. సంతతభక్తనశంకరశివ-శంకరశివ-శంకరదాసశుభంకరకృష్ణా॥

౨. నారాయణదాసపోషణశ్రుతి
భాషణశ్రుతిభాషణవిజయనగరగోపబాలా॥ మ॥

కం. గానకవితావధాన ని
ధానులగు మహాత్ములార దయతోవినుఁడీ
దీని రచియించి కృష్ణా
ధీనమ్ముగఁ గృతినొసంగితి న్మోక్షేచ్ఛన్.

